# The Hyderabad Essential Supplies (Temporary Powers) Ordinance, 1955

## న్యాయశాఖ

### హైదరాబాదు రాజప్రముఖుచే ప్రకటింపబడిన అధ్యాదేశము (ఆర్డినెన్సు)

౨౬వ జనవరి, సం. ౧౯౫౫ న రాజప్రముఖుచే ప్రకటింపబడిన ఈ కింది అధ్యాదేశము (ఆర్డినెన్సు) ఇందుమూలమున ప్రజలందరికి తెలియుటకై ప్రచురింపబడినది.

### అధ్యాదేశము (ఆర్డినెన్సు) సంఖ్య ౧, సం. ౧౯౫౫

కొన్ని సరకుల ఉత్పత్తి, సరఫరా మరియు పంపకము యొక్క మరియు వాని వ్యాపార మరియు వర్తక నియంత్రణాధికార ములను పరిమిత కాలము వరకు అవిరళముగ నుంచుటకై ఏర్పాటు చేయుట కొరకు అధ్యాదేశము.

భారత గణరాజ్యపు ఆరవ సంవత్సరమున రాజప్రముఖుచే ప్రకటింపబడినది.

శాసనసభా సమావేశము లేకపోవుట చేతను, అత్యవసర సరఫరాల (తాత్కాలిక అధికారముల) శాసనము, ౧౯౪౬ (కేంద్ర శాసనము ౨౪, ౧౯౪౬), ౨౬వ జనవరి, ౧౯౫౫ తేదీన అంతము కానుండుటచే, తక్షణ చర్య గైకొనబడవలసిన అవసరముగల పరిస్థితులు గలవని వారు నమ్ముట చేతను,

ఇపుడు, అందువలన, రాజ్యాంగము యొక్క అనుచ్ఛేదము ౨౩౮ తో సమన్వయింపబడు అనుచ్ఛేదము ౨౧౩ యొక్క కలము (౧) ద్వారా ఒసగబడిన అధికారములను వినియోగించుచు, రాజప్రముఖు, ఈ క్రింది అధ్యాదేశమును ప్రకటించుటకు అమోదించిరి :—

సంక్షిప్త నామము, వ్యాప్తి మరియు ఆరంభము.

౧. (౧) ఈ అధ్యాదేశము, హైదరాబాదు అత్యవసర సరఫరాల (తాత్కాలిక అధికారముల) అధ్యాదేశము, ౧౯౫౫ అని వ్యవహరింపబడును.

(౨) ఇది హైదరాబాదు రాష్ట్రమంతటికిని వర్తించును.

(౩) ఇది ౨౬వ జనవరి, ౧౯౫౫ తేదీన అచరణలోనికి రాగలదు.

నిర్వచనములు.

౨. ఈ అధ్యాదేశములో విషయమున లేక సందర్భమున నేదేని విరుద్ధముగ నున్నదప్ప,—

(ఎ) "అత్యవసరమగు సరకు" అనగా, నీ క్రింది సరకుల తరగతులలో నేదైన యగును :—

(i) ఆహార పదార్థములు.

(ii) నూలు వస్త్రములు.

(iii) ముడి ప్రత్తి.

(iv) ఇనుము మరియు ఉక్కు.

(బి) "ఆహార స్యములు" లో చెఱకు యును చేరును ;

(సి) "ఆహార పదార్థములు" లో తినదగు నూనె గింజలు మరియు నూనెలును చేరును ;

(డి) "ప్రకటిత ఆజ్ఞ" అనగా అధికారిక రాజపత్రము (గజెటు) లో ప్రకటింపబడిన యొక ఆజ్ఞ.

అత్యవసరమగు సరకుల ఉత్పత్తి, సరఫరా, పంపకము మొ., వాని నియంత్రణాధికారము.

3. (౧) ప్రభుత్వము, ఏదైన అత్యవసర పదార్థపు సరఫరాల నట్టేయుంచుట, లేక వాని న్యాయమగు పంపకమును మఱియు అవి తగు ధరలకు దొరకునట్లు చేయుటకు అవసరమని లేక ఆవశ్యకమని తోచునంత మట్టుకు, ఉత్తరువు ద్వారా, దాని యుత్పత్తిని సరఫరాను లేక పంపకమును మఱియు దానిలో వ్యాపారమును లేక వర్తకమును క్రమబద్ధ మొనర్చుటకు లేక నిషేధించుటకు ఉత్తరువు ద్వారా ఏర్పాటు చేయవచ్చును.

(౨) ఉప-పరిచ్ఛేదము (౧) క్రింద ఇవ్వబడిన యొక యుత్తరువు—

(ఎ) సర్వసాధారణ స్వభావముగల లేక ఒక తరగతి వ్యక్తుల బాధించు నొక యుత్తరువు సందర్భమున, అధికారిక రాజపత్రము (గజెటు) నందు ప్రకటింప బడవలయును ; మఱియు

(బి) ఒక ప్రత్యేక వ్యక్తిని బాధించు నొక యుత్తరువు సందర్భమున, అట్టి వ్యక్తి క్రింది రీతిగా అందజేయబడ వలయును :—

(i) ఆ వ్యక్తికి అందించుట ద్వారా, లేక ఇవ్వజూపుట ద్వారా, లేక

(ii) దాని నట్లు అందజేయుటకు లేక ఇవ్వజూపుటకు వీలుగానిచో, దానిని వెలుపలి తలుపుపై లేక ఆ వ్యక్తి నివసించు గృహమున స్ఫుటముగ గనపడు ఏదేని యితర స్థలమున నంటించి, అట్లంటించినట్లు దెలుపు లిఖిత పూర్వకమగు నివేదికపై ఆ పొరుగున నివసించు ఇరువురు వ్యక్తులచే సాక్షి సంతకములను గైకొనుట ద్వారా.

(3) ఉప-పరిచ్ఛేదము (౧) ద్వారా ఒసగబడిన అధికారముల సర్వసాధారణతకు భంగము లేకుండ, దాని క్రింద నొసగబడిన యొక యుత్తరువు ఈ క్రిందివానిని గూర్చి ఏర్పాటు చేయవచ్చును :—

(ఎ) అనుజ్ఞాపత్రములు, అనుమతి పత్రముల ద్వారా, లేక మఱియొక రీతిని ఏదైన అత్యవసర పదార్థపు ఉత్పత్తి లేక నిర్మాణమును క్రమబద్ధ మొనర్చుటకు ;

(బి) బంజరు లేక దున్నదగిన నేదైన భూమిని,—అది యొక కట్టడమున కానుకొని యున్నను లేకపోయినను—దానిపై సాధారణముగా ఆహార సస్యములను పెంచుటకు లేక ఒక నిర్దిష్ట ఆహార సస్యమును పెంచుటకై సాగులోనికి గొనితెచ్చుటకు, లేక మఱియొక రీతిగా సర్వసాధారణముగా ఆహార సస్యములను లేక నిర్దిష్ట ఆహార సస్యములను ఇదివరలోనున్నట్లు నిర్వహించుటకు లేక పెక్కుడు చేయుటకు ;

(సి) ఏదైన అత్యవసర పదార్థమును కొనదగు లేక అమ్మదగు ధరలను క్రమబద్ధ మొనర్చుటకు ;

(డి) అనుజ్ఞాపత్రములు లేక అనుమతి పత్రముల ద్వారా లేక మరియొక విధముగా నేదైన అత్యవసర పదార్థము యొక్క నిల్వ రవాణ పంపకము, అమ్మకము, సేకరణ, ఉపయోగము లేక వినియోగమును క్రమబద్ధ మొనర్చుటకు ;

(ఇ) సాధారణముగా విక్రయార్థముంచు ఏదేని అత్యవసర పదార్థమును అమ్మకుండ నుంచుటను నిషేధించుటకు;

(ఎఫ్) ఒక అత్యవసర వస్తువును నిల్వజేసిన ఏ వ్యక్తినైన, దానినంతయు లేక అందలి కొంత భాగమును ఆ యుత్తరువులో నిర్దిష్ట పరుపబడు ధరలకు మఱియు నట్టి వ్యక్తులకు లేక వ్యక్తుల తరగతికి లేక అట్టి పరిస్థితులలో అమ్మగోరుటకు;

(జి) ఆ ఉత్తరువు నొసగు అధికారి అభిప్రాయమున, లేక క్రమబద్ధ మొనర్పబడని పక్షమున, ప్రజా ప్రయోజనమునకు హాని కరములగునట్లుండు, ఆహార పదార్థములకు జెందిన లేక నూలు వస్త్రములకు జెందిన ఏ రకమగు వర్తక లేక ఆర్థిక వ్యవహారములనైన క్రమబద్ధ మొనర్చుటకు లేక నిషేధించుటకు;

(హెచ్) పూర్వోక్తర విషయములలో దేనినైన క్రమబద్ధ మొనర్చు లేక నిషేధించు నుద్దేశముతో, నేదైన సమాచారమును లేక అంకెలను సేకరించుటకు;

(ఐ) ఏదైన అత్యవసర పదార్థము యొక్క ఉత్పత్తి, సరఫరా, లేక పంపకమును, లేక దానిలో వ్యాపారమును లేక వర్తకమును సలుపు వ్యక్తులను, ఆ ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడు, తమ వర్తకమునకు సంబంధించిన పుస్తకములను, లెక్కలను మఱియు లేఖ్యములను నిర్వహింప గోరుటకు మఱియు పరిశీలనార్థము వానిని జూపింప గోరుటకు, మఱియు వానికి సంబంధించిన సమాచారము నివ్వగోరుటకు;

(జె) అనుషంగిక లేక అనుపూరక విషయములలో దేనికొరకైన, ముఖ్యముగ ఏ వస్తువుల నైన సోదా జేయుటకధికృతుడైన యొక వ్యక్తి యా వస్తువుల విషయమునపై యాజ్ఞ ఉల్లంఘింప బడినదని, ఉల్లంఘింప బడుచున్నదని, లేక ఉల్లంఘింప బడనున్నదని యాతడు నమ్ముటకు కారణమున్నపు డాతడేదైన యావరణ తోడిగృహములను, వాహనములను, నావలను మఱియు విమానములను ప్రవేశించుట మరియు వానిని సోదాచేయుట, అనుజ్ఞా పత్రములను, (లైసెన్సుల) పరిమిట్ల (అనుమతి పత్రములను) మరియు నితర లేఖ్యములను అనుగ్రహించుట, జారీచేయుట, లేక వానికిగాను రుసుములను వసూలు చేయుటతో సహా.

(౪) ఉప-పరిచ్ఛేదము (౧) క్రింద నొసగబడిన యొక యుత్తరువు ప్రభుత్వమునకు, లేక ప్రభుత్వాధికారులకు లేక ఉద్యోగులకు అధికారముల నొసగవచ్చును మఱియు ధర్మములను విధింప వచ్చును మఱియు అట్టి అధికారముల వినియోగముల విషయమున లేక విద్యుక్త ధర్మములను నిర్వర్తించు విషయమున, ప్రభుత్వోద్యోగులకు లేక ఉద్యోగులకు ఆదేశముల నొసగవచ్చును.

(౫) ప్రభుత్వము, ఒక అత్యవసర వస్తువు యొక్క ఉత్పత్తిని మఱియు సరఫరాను ఇదీ వరలో పెంచుటకు లేక హెక్కుడు జేయుటకుగాను అవసరమని తనకు దోచినంత మట్టుకు, ఉత్తరువు ద్వారా ఆ ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడిన సరకు యొక్క ఉత్పత్తి మఱియు సరఫరాకు జెందిన పూర్తి వ్యవహారము లేక నందలి ఏదైన భాగము విషయమున, ఆ యుత్తరువులో నాదేశింపబడు నియంత్రణ కార్యములను వినియోగించుటకు (ఇటుపై అధికృత నియంత్రణాధికారి యనబడు) నే వ్యక్తినైన యధికృతు నొనర్ప వచ్చును. మఱియు ఏదైన వ్యవహారము లేక నందలి ఏ భాగము విషయమునకైన ఈ ఉప-పరిచ్ఛేదము క్రింద నొసగబడిన యొక యుత్తరువు అమలులో నున్నంతవరకు—

(ఎ) ఆ అధికృత నియంత్రణాధికారి ఉత్తరువులో నిర్దిష్టముగ విధింపబడునంత వఱకు దక్క, ఆ వ్యవహారము సలుపువారి విద్యుక్త ధర్మములను నిర్ణయించు నేదైన శాసనము లేక ఇతర లేఖ్యము యొక్క షరతులకసందర్భముగనుండు నేదైన ఆదేశ మొసగు అధికార మాతనికి లేకుండ నుండునట్లు ప్రభుత్వముచే నొసగబడు నేపైన ఆదేశముల ననుసరించిన తన విధ్యుక్త ధర్మములను నిర్వర్తింప వలయును ; మఱియు

(బి) ఆ వ్యవహారము లేక భాగము ఆ ఉత్తరువు షరతుల ననుసరించి నియంత్రణాధికారిచే నొసగబడు నేదైన నిర్దేశముల ప్రకారము నిర్వర్తింప బడవలయును, మఱియు ఆ వ్యవహారము లేక భాగము సందర్భమున నేపైన నిర్వహణ కార్యములుగల ఏ వ్యక్తియైన అట్టి నిర్దేశములలో దేనినైన యనుసరింప వలయును.

౪. ప్రభుత్వ మొక ప్రకటిత ఆజ్ఞ, అద్వారా పరిచ్ఛేదము 3 క్రింద ఉత్తరువులొసగు అధికారము, ఉండుచో, ఆదేశములో నిర్దిష్ట పరుపబడునట్టి విషయముల సందర్భమున, మరియు అట్టి షరతులకులోబడి, ఆ యుత్తరువులో నిర్దిష్ట పరుపబడునట్టి ప్రభుత్వపు క్రింది యధికారిచే లేక యుద్యోగిచే గూడ వినియోగింప బడవచ్చుననిః ఆదేశింప వచ్చును.

అధికారముల అప్పగించుట.

౫. ఈ అధ్యాదేశము కంటె నితరముగు నేదైన శాసనము ద్వారా ఆచరణలోనున్న, మఱియు నీ యధ్యాదేశము కంటె నితరమగు నేదైన శాసనము లేక లేఖ్యములో ఏమి యున్నప్పటికిని, పరిచ్ఛేదము 3 క్రింద నొసగబడిన యొక యుత్తరువు ఆచరణ యోగ్యమై యుండగలదు.

ఇతర శాసనములకు విరుద్ధము నుండు ఉత్తరువుల ప్రభావము.

౬. (౧) ప్రత్తి గుడ్డలకు సంబంధించిన పరిచ్ఛేదము 3 క్రింది ఏదేని ఉత్తరువును ఏ వ్యక్తియైన ఉల్లంఘించినచో అతడు మూడు సంవత్సరముల వరకుబోవు గడువుగల కారావాస శిక్షతో శిక్షింపబడదగి యుండగలడు మరియు జుర్మానాకుగూడ బద్ధుడై యుండగలడు, మఱియు దేనికి సంబంధించి ఉత్తరువుల్లంఘింప బడినదో, అట్టి ఏదైని ఆస్తి లేదా న్యాయాలయమునకు యుక్తమని దోచునట్టి దానియొక్క భాగము ప్రభుత్వ వశమొనర్ప బడగలదు.

శిక్షలు.

(౨) ఆహార పదార్థములకు సంబంధించిన పరిచ్ఛేదము 3 క్రింది ఏదేని ఉత్తరువును ఏవ్యక్తియైన నుల్లంఘించినచో,—

(ఎ) శిక్షింపబడనగు హేతువులనుబట్టి, సరియైన కేవలము జుర్మానా శిక్ష న్యాయము యొక్క ఉద్దేశములకై ఉచితమని న్యాయాలయము అభిప్రాయ పడిననే దప్ప, అతడు మూడు సంవత్సరముల వరకుబోవు గడువుగల కారావాస శిక్షతో శిక్షింపబడదగి యుండగలడు మరియు జుర్మానాకుగూడ బద్ధుడైయుండగలడు ; మరియు

(బి) లిఖింపబడనగు హేతువులనుబట్టి, ఆస్తి యావత్తునకుగాని లేదా సందర్భానుసారముగా దాని ఏదేని భాగమునకుగాని సంబంధించి వశపరచుకొనుటను నిర్దేశించుట యావశ్యకమైనదని కాదని న్యాయాలయ మభిప్రాయ పడిననే దక్క, దేనికి సంబంధించి ఉత్తరువుల్లంఘింప బడినదో అట్టి ఏదేని ఆస్తి లేదా న్యాయాలయమునకు యుక్తమని దోచునట్టి దాని యొక్క భాగము ప్రభుత్వ వశమొనర్ప బడగలదు :

షరతు ఏమనగా, అయుల్లంఘనము, ఏ వ్యక్తిచేనైనను లేదా వ్యక్తుల వర్గముచేనైనను చట్టసమ్మతముగా అధీనమందుంచుకొబడదగు నేదేని ఆహార ధాన్యము యొక్క గరిష్ట పరిమాణమును నిర్ణయించునట్టి ఉత్తరువుదే అయియుండి మరియు ఆ ఉత్తరువునుల్లంఘించిన వ్యక్తి ఆ విధముగా నిర్ణయింపబడిన గరిష్ట పరిమాణమునకు రెండింతలను మించిన ఆహార ధాన్యమును తన యధీనమందుంచుకొని యున్నట్లుగా కన్పడిన సందర్భమున, న్యాయాలయము—

(ఎ) ఏడు సంవత్సరముల వరకుబోవు గడువుగల కారావాస శిక్షను మరియు అతని యధీనమందు కన్పించు ఆహార ధాన్యము యొక్క విలువకు ఇరువదింతలకు తక్కువకానట్టి జుర్మానాను విధింపగలదు ; మరియు

(బి) నిర్ణీత గరిష్ట పరిమాణమును మించియున్నట్టి మొత్తమాహార ధాన్యము ప్రభుత్వవశమొనర్పబడ వలసినదిగా ఆదేశింపగలదు.

వివరణ:— ఆ విధముగా నిర్ణయింపబడిన గరిష్ట పరిమాణమునకు ఐదు మణుగులకన్న నెక్కువగా మించియుండనంతటి అహార ధాన్యమును అధీనమందు గలిగియున్న వ్యక్తి, ఈ ఉప—పరిచ్ఛేదము యొక్క షరతు ననుసరించి శిక్షింప బడదగిన నేరము యొక్క దోషిగా భావింపబడరాదు.

(3) ప్రత్తి గుడ్డలు మరియు ఆహార పదార్థములకన్న భిన్నమైన ఏదేని అత్యావశ్యకమైన సరుకునకు సంబంధించిన పరిచ్ఛేదము 3 క్రింది ఏదేని ఉత్తరువు నే వ్యక్తియైన నుల్లంఘించినచో అతడు మూడు సంవత్సరములవరకు బోవు గడువుగల కారావాస శిక్షతో లేక జుర్మానాతో లేక రెండింటితో శిక్షింపబడదగి యుండగలడు ; మరియు ఆ ఉత్తరు వావిధముగా విధించినచో, దేనికి సంబంధించి ఆ ఉత్తరువుల్లంఘింప బడియున్నట్లుగా న్యాయాలయము సంతృప్తిపడునో అట్టి ఏదేని ఆస్తి ప్రభుత్వ వశమొనర్పబడ వచ్చును.

(౪) పరిచ్ఛేదము 3 యొక్క ఉప—పరిచ్ఛేదము (౫) ననుసరించి ఎవరికొక ఆదేశ మొసగబడినదో, అట్టి ఏ వ్యక్తియైనను ఆ ఆదేశమును పాటించుటకు దప్పినచో, అతడు మూడు సంవత్సరములవరకు బోవు గడువుగల కారావాస శిక్షతో లేక జుర్మానాతో లేక రెండింటితో శిక్షింపబడదగి యుండగలడు.

**౭.** ప్రత్తి గుడ్డలకు లేదా ఆహార పదార్థములకు సంబంధించినట్టి, పరిచ్ఛేదము ౬ ననుసరించి శిక్షింపబడదగి యున్నట్టి ఏదేని నేరమొనర్పబడి నప్పుడెప్పుడైనను, న్యాయాలయము, పరిచ్ఛేదము 3 ననుసరించి ఇయ్యబడిన ఉత్తరువు ఆ విధముగా విధించిననో, ఎందులో సదరు పరిచ్ఛేదము ననుసరించి వశమొనర్చుకో బడుటకు బద్ధమైయున్న ఏదేని ఆస్తి కనుపించునో అట్టి కట్టలు (ప్యాకేజీలు), ఒరలు, (కవరింగులు), లేక దాచియుంచు స్థలములు (రెసెప్టెకల్సు), మరియు సదరు ఆస్తిని చేరవేయుట యందుపయోగింపబడిన జంతువులు వాహనములు, పడవలు, లేక ఇతర వాహకములు ప్రభుత్వ వశమొనర్పబడగలవు :

*నేర మొనర్చుట యందుపయోగింపబడిన కొండొక యాస్తిని వశపరచుకొనుట.*

షరతు ఏమనగా, నేర మొనర్ప బడుచుండినట్లు, లేక ఒనర్పబడనగునట్లు, లేక బహుశః ఒనర్ప బడనగునట్లు వాటి యజమానికి తెలిసియుండెనని నిరూపింపబడిననే దప్ప, ఈ అధ్యాదేశము ననుసరించి ఒక నేర విచారణము చేయుచున్న ఏ న్యాయాలయము కూడ అట్టి ఏ కట్టను (ప్యాకేజిని) ఒరను (కవ రింగును) లేక దాచియుంచు స్థలమును (రెసెప్టెకలును) లేక అట్టి ఏ జంతువును, వాహనమును, పడవను లేక ఇతర వాహకమును ప్రభుత్వ వశమొనర్పబడినదిగా ప్రకటింప గూడదు.

**యత్నములు మఱియు తోడ్పాట్లు.**

౮. పరిచ్ఛేదము 3 ననుసరించి ఇయ్యబడిన ఏదేని ఉత్తరువు నుల్లంఘించుటకు యత్నించునట్టి లేదా ఉల్లంఘనమునందు తోడ్పడునట్టి ఏ వ్యక్తియైనను ఆ వుత్తరువు నుల్లంఘించి యున్నట్లుగా భావింప బడగలడు.

**సంఘముల (కార్పొరేషనుల) వలని నేరములు.**

౯. పరిచ్ఛేదము 3 ననుసరించి ఇయ్యబడిన ఉత్తరువు నుల్లంఘించిన వ్యక్తి ఒక కంపెనీ లేక ఇతర సంఘటిత సంస్థయైనచో, దానియొక్క ప్రతి సంచాలకుడు (డైరెక్టరు), నిర్వాహకుడు (మేనేజరు), కార్యదర్శి లేక ఇతరాధికారి లేక ముక్త్యారు (ఏజెంటు) ఆ యుల్లంఘనము తనకు తెలియకుండగనే జరిగియుండినట్లు లేక అట్టి యుల్లంఘనము నిరోధించుటకై తగిన శ్రద్ధ నంతటిని తాను గైకొని యుండినట్లును అతడు రుజువు పరచిననే దప్ప, అట్టి యుల్లంఘనము యొక్క దోషియై యుండినట్లు భావింప బడగలడు.

**అసత్యపు వాఙ్మూలములు.**

౧౦. ఏ వ్యక్తియైనను—

(i) ఏదేని వాఙ్మూలమియ్య వలసినదిగా లేక ఏదేని భోగట్టానందజేయ వలసినదిగా పరిచ్ఛేదము 3 ననుసరించి ఏదేని ఉత్తరువు ద్వారా ఆదేశించ బడినప్పుడు, ఏదేని ముఖ్యాంశము నందసత్యమైనట్టిదియును మఱియు అసత్యమైనట్టిదిగా తనకు తెలిసినట్టి లేక అట్లు విశ్వసించుటకు సహేతుకమైన కారణము గలిగియున్నట్టి, లేక సత్యమైనదని విశ్వసింప నట్టి ఏదేని వాఙ్మూలమిచ్చినచో లేక భోగట్టా నందజేసినచో, లేదా

(ii) పైన పేర్కొన్నట్టి ఏదైన వాఙ్మూలమును, అట్టి ఏదేని ఉత్తరువు ద్వారా తాను నిర్వహింప వలసినదిగా లేక అందజేయ వలసినదిగా ఆదేశింపబడినట్టి ఏదేని పుస్తకము, ఖాతా, అభిలేఖ్యము (రికార్డు), ప్రకటన, తఖ్తా లేక ఇతర దస్తావేజునందు వ్రాసినచో, అతడు మూడు సంవత్సరముల వరకుబోవు గడువుగల కారావాస శిక్షతో లేక జుర్మానాతో లేక రెండింటితో శిక్షింపబ డదగియుండ గలడు.

**నేరముల విచారణ.**

౧౧. ఏ న్యాయాలయము కూడ, అట్టి నేరము నేర్పరచునట్టి యంశముల నివేదిక లిఖిత పూర్వకముగా, భారతీయ దండ విధి సంహిత (ఇండియన్ పీనల్ కోడ్) (శాసనము సంఖ్య ౪౫, సం. ౧౮౬౦) యొక్క పరిచ్ఛేదము ౨౧ లో నిర్వచింపబడినట్టి ప్రభుత్వోద్యోగియైన యొక వ్యక్తిచే నియ్యబడినప్పుడే

దక్క, ఈ అధ్యాదేశము ననుసరించి శిక్షింప బడదగియున్న ఏదేని నేరమును సంజ్ఞానములోనికి తీసుకొన కూడదు.

నేరములను టూకీగా విచారించు నధికారము.

౧౨. నేర ప్రక్రియా సంహిత (కోడ్ ఆఫ్ క్రిమినల్ ప్రొసీజర్), ౧౮౯౮ (శాసనము సంఖ్య ౫, సంవత్సరము ౧౮౯౮) యొక్క పరిచ్ఛేదము ౨౬౦ యొక్క ఉప-పరిచ్ఛేదము (౧) లో నిర్దిష్ట పరుపబడిన నేరములను టూకీగా విచారించుటకై ఆ సమయమునందు అధికృత మొనర్పబడిన ఏ దండనాధికారి (మేజిస్ట్రేటు) యైనను లేక దండనాధికారి వర్గమైనను, వాదిపక్షమున (ప్రాసిక్యూషన్) చే ఇందు నిమిత్తమై అర్జీ పెట్టుకొనబడిన మీదట ఈ అధ్యాదేశము ననుసరించి శిక్షింపబడ దగియున్న ఏదేని నేరమును సదరు సంహిత యొక్క పరిచ్ఛేదములు ౨౬౨ నుండి ౨౬౫ లో గల షరతుల కనుగుణముగా విచారింప వచ్చును.

జుర్మానాలకు సంబంధించి ప్రత్యేకమైన నిబంధన.

౧౩. నేర ప్రక్రియా సంహిత (కోడ్ ఆఫ్ క్రిమినల్ ప్రొసీజర్), ౧౮౯౮ (శాసనము సంఖ్య ౫, సం. ౧౮౯౮) యొక్క పరిచ్ఛేదము ౩౨ లో నేమియున్నప్పటికిని, ఇందు నిమిత్తమై ప్రభుత్వముచే ప్రత్యేకముగా నధికృత మొనర్పబడిన ఏ మొదటితరగతి దండనాధికారియైనను పరిచ్ఛేదము 3 ననుసరించి ఇయ్యబడిన ఏదేని ఉత్తరువు నుల్లంఘించినట్లుగా నిర్ధారణ చేయుబడిన ఏ వ్యక్తికైనను ఒక వేయి రూపాయలను మించిన జుర్మానా శిక్షను వేయుట చట్టసమ్మతమై యుండగలదు.

జామీనుకు సంబంధించి ప్రత్యేక నిబంధన.

౧౪. నేర ప్రక్రియా సంహిత, ౧౮౯౮ (శాసనము సంఖ్య ౫, సం. ౧౮౯౮) లో నేమి యున్నప్పటికిని, పరిచ్ఛేదము ౬ యొక్క ఉప-పరిచ్ఛేదము (౨) యొక్క షరతు ననుసరించి శిక్షింప బడదగియున్నట్టి, ఆహార ధాన్యములకు సంబంధించిన పరిచ్ఛేదము 3 క్రింది ఏదేని ఉత్తరువు యొక్క ఉల్లంఘనము ఆరోపింప బడినట్టి లేక నిర్ధారణ మొనర్చబడినట్టి ఏ వ్యక్తియైనను, కావలో యుండుండినచో,—

(ఏ) అట్టి విడుదలకైన అర్జీని వ్యతిరేకించుటకు వాది పక్షమున కవకాశమీయబడి యుండి, మరియు

(బి) వాది పక్షము ఆ అర్జీని వ్యతిరేకించిన సందర్భమున, అతడట్టి యుల్లంఘనము యొక్క దోషియై యుండడని విశ్వసించుటకు నయుక్తికమైన యాధారములున్నవని న్యాయాలయమునకు దోచిన నే దప్ప—

జామీనుపై లేక తన స్వంత బంధన పత్రము (బాండ్) పై విడుదల చేయుబడగూడదు.

వాదములు శీఘ్రముగా పరిష్కారము చేయబడవలయుట.

౧౫. ఈ అధ్యాదేశము యొక్క పరిచ్ఛేదము ౧౨ ననుసరించి ఏదేని నేరము టూకీగా విచారింప బడుచుండ కుండని సందర్భమున,—

(ఏ) నేర ప్రక్రియా సంహిత, ౧౮౯౮ (శాసనము ౫, సం. ౧౮౯౮) యొక్క పరిచ్ఛేదము ౨౬౩ యొక్క ఉప-పరిచ్ఛేదము (౧) నభ్యుద్దేశించి, దండనాధికారి, లిఖిత రూపమున నభిలిఖింథ

బడనగు కారణములను బట్టి, ఆ వాదమును మరొక రోజుకు—కాని నాలుగు రోజులకన్న నాలస్యము గాకుండ—వాయిదా వేసియుండినదేదప్పు, అపరాధము కూర్పబడిన దినమునకు తరువాతి దినము ఆ వాదము యొక్క అనంతరపు దావాను వినుట నిర్ణయింపబడవలెను.

(బి) లిఖింపబడనగు కారణములనుబట్టి, శ్రవణమును తర్వాతి దినమునుదాటి వాయిదా వేయుట ఆవశ్యకమని న్యాయాలయమునకు దోచిననే దప్పు, వాదమును వినుట ప్రతి దినము కొనసాగింపబడుచుండవలెను.

ఉత్తరువులకు సంబంధించి సంభావ్యత.

౧౬. (౧) ఈ అధ్యాదేశము మూలమున లేక అనుసరించి సంక్రమించిన ఏదేని యధికారము వినియోగించుచు నియ్యబడిన ఏ ఉత్తరువుపైనను ఏ న్యాయాలయమునందును వివాదము నిమిత్తమై తేబడరాదు.

(౨) ఈ అధ్యాదేశము మూలమున లేక అనుసరించి సంక్రమించిన ఏదేని అధికారమును వినియోగించుచు నొక యుత్తరువియ్యబడినట్లు, తెలుపబడి యొక అధికారిచే సంతకము చేయబడిన సందర్భమున, ఒక న్యాయాలయము, భారతీయ సాక్ష్య శాసనము, ౧౮౭౨ (శాసనము ౧,సం. ౧౮౭౨) యొక్క అర్థమును బట్టి అట్టి ఉత్తరు వాయధికారిచే నియ్యబడినట్లుగా భావింప గలదు.

కొన్ని సందర్భములందు నిరూపణా భారము.

౧౭. ఏ వ్యక్తి పైనైనను, చట్టసమ్మతాధికారము లేకుండ లేక పర్మిటు, లైసెన్సు, లేక యితర దస్తావేజు లేకుండ ఒక కృతమును చేయుట నుండి లేక ఒక వస్తువును తన యధీనమున నుంచుకొనుట నుండి నిషేధించునట్టి పరిచ్ఛేదము 3 ననుసరించి యియ్యబడిన ఏదేని యుత్తరువునుల్లంఘించి నందులకు దావాచేయబడిన సందర్భమున, తాను, అట్టి అధికారమును, పర్మిటును, లైసెన్సునను లేక యితర దస్తావేజును గల్గి యుండినట్లు నిరూపించు భారము అతనిపై నుండగలదు.

ఈ అధ్యాదేశము ననుసరించి తీసుకోబడిన చర్య రక్షణ.

౧౮. (౧) పరిచ్ఛేదము 3 ననుసరించి యియ్యబడిన ఏదేని ఉత్తరువున కనుసారముగా సద్భావముతో చేయబడిన లేక చేయనుద్దేశింప బడిన ఏదేని విషయమునకై ఏ వ్యక్తికైనను విరుద్ధముగా ఎట్టి వ్యాజ్యము, కార్యవాహి, లేక చట్టబద్ధ కార్యవాహి చేయుటకు వీలుండదు.

(౨) పరిచ్ఛేదము 3 ననుసరించి యియ్యబడిన ఏదేని ఉత్తరువున కనుసారముగా సద్భావముతో చేయబడిన లేకచేయ నుద్దేశింప బడిన ఏదేని విషయము వలన కలిగినట్టి లేక బహుశః కలగనున్నట్టి ఏదేని నష్టమునకై ప్రభుత్వమునకు విరుద్ధముగా ఎట్టి వ్యాజ్యము లేక చట్టబద్ధ కార్యవాహి చేయుటకు వీలుండదు.

ప్రకృతమందున్న ఉత్తరువు అమలులో నుండుట కొనసాగుట.

౧౯. ఈ అధ్యాదేశము ననుసరించి యితర నిబంధనలు చేయబడనంత దాక, ఏదేని యుత్తరువు ప్రకటింప బడినదైనను కాకున్నను, అత్యావశ్యక సరఫరాల (తాత్కాలికాధికారముల) శాసనము, ౧౯౪౬ (కేంద్ర శాసనము ౨౪, సం. ౧౯౪౬) ననుసరించి యియ్య బడినట్టిది లేక యియ్యబడినట్లు భావింప బడినట్టిది, ఈ అధ్యాదేశారంభమునకు సరిగా పూర్వము అమలులో నున్నట్టిది, సదరు శాసనము గడచి పోయినప్పటికిని, ఈ అధ్యాదేశమున కనుకూలముగా నున్నంత మేరకు

గా వహాగుచుండగలదు, మరియు ఈ అధ్యాదేశము ననుసరించి యియ్యబడిన ఉత్తరువుగా భావింప బడగలదు; మరియు అట్టి ఏదేని ఉత్తరువు ననుసరించి నటియ్యు మరియు నట్టి యారంభము నకు నేరుగా పూర్వసమయములలో నున్నట్టియు చేయబడినది సమస్త నియామకములు, అనుగ్రహింపబడిన లైసెన్సులు లేక పర్మిట్లు, మరియు జారీచేయబడిన ఆదేశములు అదే విధముగా అమలులో నుండుట కొనసాగ గలవు, మరియు ఈ అధ్యాదేశమున కనుసారముగా చేయబడినట్లు, అనుగ్రహింప బడినట్లు, లేకజారీచేయ బడినట్లు భావింప బడగలవు.

తేది ౩౧వ జనవరి, ౧౯౫౨.

మీర్ ఉస్మాన్ అలీఖాన్,
హైదరాబాదు రాజప్రముఖు

---

(రాజప్రముఖుని నాజ్ఞచే)

యస్. యమ్. యూనస్,
న్యాయశాఖ కార్యదర్శి.